రాయలసీమ అవసరాలు
రాష్ట్రమంత్రి హామీ
2-వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఇండియా పాకిస్తాన్
ఒప్పందం
3-వ పేజీ

217030

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118. Vol. 34 No. 324 THURSDAY 18th MARCH 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# కాశ్మీర్ సమస్యాపరిష్కారానికి భద్రతామండలిలో కొత్తప్రతిపాదన

## వ్యవసాయాభివృద్ధి పథకానికి ప్రత్యేక ప్లానింగ్ కమిటీ

### అధివివేశ ప్రభుత్వ నిర్ణయం: శాసనసభలో దౌలత్‌రాం ప్రకటన

### దేశ ఆహార పరిస్థితి ఆశాజనకంగానేవున్న హామీ

న్యూఢిల్లీ, మార్చి 16: ఈరోజు భారతశాసనసభలో, బడ్జటులో ఆహారశాఖకై ప్రత్యేకించబడిన గ్రాంట్ల విషయమై జరిగిన చర్చకు ఇండియా ఆహారమంత్రి జైరాందాస్ దౌలత్‌రాంగారు జవాబిస్తూ "దేశ ఆహారపరిస్థితిలో గొప్ప అభివృద్ధికలిగినది. కాబట్టి ఆ విషయమై ఆందోళనగానీ, భయంగాని అవసరం లేదు," అన్నారు. వెంటనే అక్కరకువచ్చేవీ, దీర్ఘకాలానికి పనికివచ్చేవీ, అయిన వ్యవసాయ పథకాలను తయారుచేసేందుకు ఒక ప్లానింగ్ కమిషన్‌ను స్థాపించ నిశ్చయించుకున్నానని తెలియజేశారు. దేశం ఆహారం విషయంలో స్వయంపోషకం కావాలంటే, ఏప్రాంతానికాప్రాంతం స్వయంపోషకమయే ప్రయత్నాలు చేయటం ఉత్తమమనీ, ఈ ఆహారసమస్యను కేంద్రప్రభుత్వం సక్రమంగా పరిష్కరించకలగాలంటే, కేంద్రప్రభుత్వానికి ఈ విషయమై విశేషాధికారాలు ఇవ్వటం అవసరమనే అంశాన్ని ప్రజాపరిషత్తు గమనించి, నూతన రాజ్యాంగంలో తగిన ఏర్పాట్లుచేయాలనీ హెచ్చరించారు.

## పాకిస్తాన్‌లో ఖద్దరు ఉత్పత్తి

### వస్త్రక్షామనివారణోపాయం

కరాచీ, మార్చి 16: పాకిస్తానులో బట్టలకొరత విస్తారముగా నున్నది. ఈ కొరతను తొలగించి పాకిస్తాను ఆర్థిక వ్యవస్థను దృఢపరుచుటకు జనసామాన్యముచే ఖద్దరుఉత్పత్తి చేయించు విషయమై పాకిస్తాను ప్రభుత్వములో కొన్నివర్గముల వారు తీవ్రముగా ఆలోచించుచున్నారు. పాకిస్తానులో 4 లక్షల చేమగ్గములు కలవు. వీరిలో సగము పశ్చిమ పాకిస్తానులోను, సగము తూర్పుపాకిస్తానులోను వున్నవి. నూలుకొరత విస్తారముగా నుండుటచేత అవి మూలబడియున్నవి. రాటముపై నూలుతీయుటను గృహపరిశ్రమగా ప్రోత్సహించేయెడల విస్తారంగా ఖద్దరు తయారగుననీ, బట్టలకొరత చాలవరకు తగ్గునని చెప్పుచున్నారు. ఇట్లుచేసినయెడల పాకిస్తాను ప్రస్తుతము విదేశములలో దవకగలవన్నీ సకలనిన అవసరముండదని, పాకిస్తాను జాలరు, స్టర్లింగు మారకములు వ్యయముకాకుండా నుండునని చెప్పుచున్నారు.

## చర్చా వివరాలు

సభలో మనంద్రపాఠుంతా చర్చకు ప్రారంభిస్తూ, అధికాహారోత్పత్తి, దేశాన్ని స్వయంపోషకం చేయటం, మొదలైన అన్ని విషయాల్లోనూ, రైతులు తమ జీవితావసరాలూ, ఆధమపక్షం రోజుకు పొసగింజలయినా, దొరికేట్లు చూడటం ప్రభుత్వం తన ప్రధానకర్తవ్యంగా భావించుకోవాలి చదువుకున్నవారూ, వ్యవసాయశాఖవారూ తమ ప్రస్తుత సంకుచిత దృక్పథాన్ని మార్చుకుని రైతుల అవసరాలను గమనించాలి" అని అన్నాడు.

చౌధురీ రణబీర్‌సింగ్ ఈవిధంగా మాట్లాడాడు: "కేవలం పట్టణవాసుల సౌకర్యంనిమిత్తం ప్రభుత్వం ఇంతవరకూ కంట్రోళ్లను వుంచింది, కాని దేశఆర్థిక స్థితి రైతులమీద ఆధారపడి వుంటుందన్న అంశాన్ని విస్మరించింది. ప్రభుత్వం వ్యవసాయ పరికరాల ధరలను కంట్రోలుచేసి, వ్యవసాయికోత్పత్తులకు కనీసపు ధరలు నిర్ణయించాలి. ఆహార పదార్థాలను చౌకగా అమ్మించే నిమిత్తం పెద్దపెద్ద నష్టాలను భరించటంకన్నా, చావులు తగ్గిస్తే ఉత్పత్తి అధికం కాగలదు. బెలంధర మునుపు 24 రూపాయలనుండి 4 రూపాయలకు తగ్గినప్పటికీ, ధరను స్థిరంగావుంచే ప్రయత్నమేమీ ప్రభుత్వం చేయలేదు."

(6-వ పేజీ చూడుడు)

## చైనా కమ్యూనిస్టుల విజయం

### మంచూరియా యుద్ధగతి

షాంగ్‌హై, మార్చి 16: ప్రధాన రైల్వే పట్టణమైన జెపింగ్ కయ్ కమ్యూనిస్టు సేనలకై వశమైనట్లు చైనాప్రభుత్వం ఒప్పుకొన్నది. ప్రభుత్వసేనలు కీలకస్థానాలలోకి ఉపసంహరించబడినాయని, జెపింగ్ నగరంకోసం జరిగిన యుద్ధంలో 20 వేలమంది కమ్యూనిస్టు సైనికులు హతమైనారని, మరి 200 మంది ఖైదీలుగా పట్టుబడ్డారని ప్రభుత్వప్రకటన తెలుపుతున్నది.

హోనాన్‌కు వాయవ్యంగా ఉండే రైల్వే పట్టణంకోసం సాగుతున్న యుద్ధం ప్రభుత్వ సేనలకు అనుకూలంగా ఉన్నట్లు కొన్ని అనధికారవార్తలవల్ల తెలుస్తున్నది. ట్సియాన్ రైలుమార్గం వెంబడిగా సాగివస్తున్న కమ్యూనిస్టు సేనలను లంగ్ షాన్ వద్ద చైనాప్రభుత్వసేనలు అడ్డగించుటచే కొంతసైన్యం అటనుండి ఈశాన్యదిశగా మరలిపోతున్నది.

ఉత్తర యాంగ్సీ, అన్‌హై రాష్ట్రాలలో భారీయెత్తు కమ్యూనిస్టు సైనికసంచలనం ఉన్నట్లు తెలుస్తున్నది. నాన్‌కింగ్ నగరానికి ఉత్తరంగా 100 మైళ్ళదూరంలో ఉన్న ప్రభుత్వసైన్యాల ప్రధాన స్థావరం హెవింగ్ పైకి రెండు కమ్యూనిస్టు దళాలు పురోగమిస్తున్నాయట.

### ప్రభుత్వ సేనానులు గవర్నర్ల సమావేశం

ప్రస్తుత అంతర్యుద్ధం లో జా లో జా ప్రభుత్వానికి ప్రతికూలంగా పరిణమిస్తుండుటచేత, పరిస్థితిని చర్చించేందుకుగాను మార్చి 20 వ తేదీన నాన్‌కింగ్ నగరంలో, సేనాపతుల, మధ్యచైనారాష్ట్ర గవర్నర్ల సమావేశం ఏర్పాటుచేయబడింది. జనరలిస్సిమో చాంగ్ కైషేక్ స్వయంగా యీ సమావేశాన్ని యేర్పాటు చేసినట్లు నాన్‌కింగ్‌నుంచి రాయిటర్ విలేఖరి పంపినవార్తవల్ల తెలుస్తున్నది. యాంగ్ ట్సీనదికి దక్షిణంగానున్న చైనాలో ఉన్న ప్రభుత్వస్థావరాల రక్షణ, యిందుకుగాను స్థానిక రక్షణసైన్యాల నిర్మాణం, ప్రజాసేన సమీకరణ, ఆహారపదార్థాలసేకరణ, మొదలగు ముఖ్యవిషయాలు ఈసమావేశంలో చర్చించబడతాయి.

ముక్డెన్‌కు నైరుతి దిశగా 180 మైళ్ళ దూరంలో ఉన్న చింగ్ చౌ నగరంవద్ద ప్రభుత్వసేనలు బ్రహ్మాండంగా కేంద్రీకరించబడుతున్నట్లు ప్రభుత్వవర్గాలు ధృవపర్చాయి. పెయిపింగ్ ముక్డెన్ రైలుమార్గాన్ని దీని వెంబడివున్న కీలకస్థావరాలను శాశ్వతంగా తమ అదుపులో ఉంచుకొనేందుకే యీ యత్నమట.

## 18-వతేదీన ప్రతిపాదనకై అధ్యక్షుడు డా॥ ట్సియాంగ్ సిద్ధపరిచాడట

### వివిధరాజ్యప్రతినిధులతో విడివిడిగా గోపాలస్వామి అయ్యంగారి చర్చలు

లేక్‌సక్సెస్, మార్చి 17: కాశ్మీర్ విషయమై చర్చసాగించటానికి భద్రతామండలి రేపు సమావేశమౌతుంది. భద్రతామండలి అధ్యక్షుడు డా॥ టి. ఎఫ్. ట్సియాంగ్ (చైనా) రేపటి సమావేశంలో సమస్యాపరిష్కారానికి ఒక నూతన ప్రతిపాదన చేస్తాడని తెలుస్తున్నది. సంప్రతింపులు చాలాదూరం పురోగమించినవనీ, డా॥ ట్సియాంగ్ ఇవాళటిలోగా ఒక చిత్తు తీర్మానాన్ని కూడా తయారుచేయగలుగుతాడనీ అనుకుంటున్నారు. మిగతా ప్రతినిధులకు కూడా ఈచిత్తు తీర్మానం ప్రతి చూపబడవచ్చును. ఇండియా పాకిస్తాన్ ప్రతినిధులను అధ్యక్షుడు ఇవాళ రౌండ్‌టేబిల్ సమావేశానికి ఆహ్వానించవచ్చునని కూడా అనుకుంటున్నారు.

భారత ప్రతినిధివర్గ నాయకుడు గోపాలస్వామి అయ్యంగారు బెల్జియమ్, ఫ్రాన్సు, బ్రిటన్, అమెరికా, ఆ... దేశాల ప్రతినిధులతో సమాలోచనలు జరిపారు. కాశ్మీరులో "తటస్థ" ప్రభుత్వాన్ని నెలకొల్పాలన్న ప్రతిపాదనను విమర్శిస్తూ అయ్యంగారు ఇలా అన్నారు:—

ప్రపంచ రాజ్యాంగచరిత్రలో ఎక్కడా ఇటువంటి ప్రతిపాదన పూర్వంగాని అనవాయితీగాని కనిపించదు; ఈ ప్రతిపాదనను అంగీకరించేయెడల ముందు చాలా ప్రమాద భరితమైన ఫలిత పర్యవసానాలు ఏర్పడగలవు. ఒకవేళ ఏ రెండు దేశాల మధ్య ఇటువంటి వివాదవచ్చినా, ఈ వగ వడిసే భద్రతామండలి నడుచుకోవలసివస్తుంది. ఇలాంటి వరవడి పెట్టడం చాలా ప్రమాదకరం."

## వింధ్యప్రాంత సంస్థానాల ఏకీకరణకు నరేంద్రులసమ్మతి

### సంస్థానాధీశులసభలో వి. పి. మీనన్ ప్రకటన: ఏప్రిల్ 2-వ తేదీన రాజప్రముఖుని ఎన్నిక

ఝాన్సీ, మార్చి 16: "స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ ఇండియాకు అంతఃప్రమాదాలను, బాహ్యప్రమాదాలను కూడా ఎదుర్కొనవలసిన క్లిష్టపరిస్థితి సంభవించింది. అట్టి సందర్భంలో సర్వేయగా, దూరదూరంగా చిన్నచిన్న సంస్థానాలనేకం తమ ఇష్టంవచ్చినట్లు సంచరించటం దేశానికంతటికీ ప్రమాదహేతువు. కనుకనే చిన్న సంస్థానాలన్నీ టినీ కలిపి కొన్ని కొన్ని కూటములుగా ఏర్పరచి వానిని భారత ప్రభుత్వానికి లోబడిన రాష్ట్ర విభాగాలుగా చేయాలని సంస్థానశాఖ ప్రయత్నిస్తున్నది. ఇదే మాసంస్థాన శాఖవిధానం" అని సంస్థానశాఖా కార్యదర్శి వి. పి. మీనన్ బుందేల్‌ఖండ్, బఘేల్‌ఖండ్ నరేంద్రుల సమావేశంలో మాట్లాడుతూ తమ వైఖరిని స్పష్టంచేశాడు.

ఈసంస్థానాధీశులతో వి. పి. మీనన్ జరిపిన చర్చల ఫలితంగా, "వింధ్యప్రదేశ సంయుక్త సంస్థానములు" అను పేరుతో వారంతా ఐక్యం కావటానికి అంగీకరించారు.

వీరంతా ఒక "రాజప్రముఖు"ని ఎన్నుకొని ఆయనకు ఏప్రిల్ 2 తేదీన తమ అధికారాలను వశంచేస్తారు. మే 15 ప్రాంతంలో ఒక తాత్కాలిక మంత్రివర్గం ఏర్పడుతుంది. దీనిలో ప్రజాప్రతినిధులే వుంటారు. ఈనూతన సంస్థాన కూటమి చాల విషయాలలో సౌరాష్ట్ర రాజ్యాంగాన్నే అనుసరిస్తుంది.

రేవా నరేంద్రుడిచే బహుశః రాజప్రముఖుడుగా ఎన్నుకోవచ్చు, కాని రేవా సంస్థానమునకు ప్రత్యేకంగా ఒక తాత్కాలిక మంత్రివర్గమూ, బుందేల్‌ఖండ్, బఘేల్‌ఖండ్ సంస్థానాలకు వేరొక మంత్రివర్గ

(6-వ పేజీ చూడుడు)

## ఎమిలీ బొల్లార్డుపై హత్యాప్రయత్నం

### అన్నాంలో వుండగా చేతిబాంబు ప్రేలుడు

పారిస్, మార్చి 16: ఇండోచైనాలో ఫ్రెంచి హైకమీషనర్ ఎమిలీ బోలార్డు మార్చి 11 వ తేదీన అన్నామ్‌లోని నా ట్రాంగ్‌ను దర్శిస్తుండగా ఆతనికి 15 గజాల దూరంలో చేతిబాంబు ప్రేలింది. ఆతనికిగాని, మరెవ్వరికిగాని అపాయం జరగలేదు అని ఫ్రెంచివార్తాసంస్థ నేటిరాత్రి ప్రకటించింది.

మరొక ఫ్రెంచి అధికారి కారులో కూడా ఒక చేతిబాంబు కనిపించింది. దానిని తొలగించివేశారు. మార్చి 11 నాటి రాత్రి మరొకబాంబు బోలార్డుపై ప్రయోగింపబడింది. బోలార్డు దగ్గరకురాగానే అది ప్రేలేటట్లు యేర్పాట్లు చేయబడ్డాయి. కాని బాంబు చెడిపోయినందువల్ల ప్రేలలేదు. ఈ మూడవ బాంబు జపాను తయారీదట.

## విశాఖపట్నం సిటీసప్లయి

చెన్నపట్నం, మార్చి 17: ఇక్కాళ్లనుంచి విశాఖపట్నం మిలిటరీవారి చేతుల్లో ఉన్న సిటీ సప్లైని, విశాఖపట్నం మ్యునిసిపాలిటీకి ఇచ్చివేయాలని నిశ్చయించబడింది. కేంద్ర ప్రభుత్వం వారిదగ్గర నుంచి, ఈ సప్లైనంతా అప్పగింతలు చేసుకోటానికి శ్రీ తిక్కోటి విశ్వనాథం, మదరాసు ప్రభుత్వపు చీఫ్ శానిటరీ ఇంజనీరుతో సహా, రేపు ఉదయం ఢిల్లీకి విమానంలో వెళ్లుతున్నారు.

## సాందూర్ విముఖత

### మైసూర్‌లో గాని మద్రాస్‌లో గాని కలవదట

#### సంస్థానప్రధాని ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 16: 'సాందూర్ సంస్థానం మైసూరులోగాని, మద్రాసు రాష్ట్రములోగాని కలిసిపోవుట సాందూరు ప్రభుత్వమునకు, సాందూరు ప్రజలకు యెంతమాత్రం యిష్టంలేదు. సాందూరు స్వతంత్రంగానుండి భారతయూనియన్లో చేరుట వారియభిమతము' అని సాందూరు ప్రధాని డా॥ ఎస్.బి. ప్రాఫ్‌గారు నేడొక ప్రకటన గావించుచు చెప్పుచున్నారు.

సంస్థానాధీశ్వరునియొక్కయు, ప్రజలయొక్కయు అభిప్రాయములను సంస్థానశాఖ వారికి, సర్దార్ పటేలుగారికి తెలియ చెప్పుటకు యితర సంస్థాన రాయబారులతోబాటు తానుగూడ ఢిల్లీ వచ్చెనని డా॥ ప్రాఫ్ గారు చెప్పుచు, యూనియనులో కలిసిపోవుటకు మహారాజు, ప్రజలు సంపూర్ణముగా విముఖులని అందరు గ్రహించవలెననుచున్నారు.

## జూన్ నెలలో మౌంట్ బాటెన్ విరమణ?

### తరువాత గవర్నర్ జనరల్ రాజాజీ.

లండన్, మార్చి 16: ఇక్కడి పరిశీలకులు భారతదేశంలోని రాజ్యాంగ మార్పులకు శ్రద్ధతో పరిశీలిస్తున్నారు. లార్డ్ మౌంట్‌బాటెన్ తరువాత సి. రాజగోపాలాచారిగారు గవర్నరు జనరల్ కావచ్చునని వీరు అంటున్నారు. మౌంట్‌బాటెన్ ప్రభువు ఉద్యోగ విరమణకు భారత నూతన రాజ్యాంగం అములుకావటానికి మధ్యకాలంలో ఆ ఉద్యోగాన్ని నిర్వహించటానికి రాజాజీయే ఎక్కువగా తగియున్నాడని వీరి అభిప్రాయం.

జూన్ 31 వ తేదీతో ప్రస్తుతోద్యోగంనుంచి విరమించిన తర్వాత మౌంట్‌బాటెన్ తిరిగి నావా సైన్యంలో ప్రవేశిస్తాడని చాలామంది భావిస్తున్నారు. గ్లోబ్





'జల ఉష' నౌక మహాసాగర జలాలలో ప్రవేశిస్తున్న దృశ్యం



ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రత్యేక స్నాతకోత్సవములో భారతప్రధానామాత్యుడు నెహ్రూగారు ఉపన్యసిస్తున్న దృశ్యం

